# నాగేశ్వరమనీషి జీవిత తత్త్వము

జొన్నలగడ్డ సత్యనారాయణరావు

"ఈతనిస్థానము నెవ్వ రాక్రమింపగలరు" అని విశ్వదాత దివంగతు డైనంతన మిగుల వాపోవుచు మహాత్ముడు వాకొనెను.

నాడు దశదిశలనుండి కన్నీటికాల్వలు జాల్వారినవి.

తీవ్రమైన ఆక్రందనము ఆంధ్రహృదయముల చీల్చుకొని వెడలినది. ఆంధ్రజనయిత్రి రక్తమందు రక్తమై, ఆయువులోని ఆయువై, ఈతల్లిజీవితమున గలసియున్న శక్తి అంతర్హితమైనది.

దేశోద్ధారకుడు 1867 లో నుదయించి 1938 లో నస్తమించెను. ఉదయాస్తమయములనడుమ దక్షిణాకాశమున దేజరిల్లిన ఈజీవితమెట్టిదో అసంఖ్యాకు లవలోకించిరి.

పుంఖానుపుంఖముగ వస్తువును పరిశీలించి, దాని ప్రాణమై, అందు నిహితమైన నిజము మాత్రమెద్దియో శాస్త్రవేత్త కన్గొనును. పూర్ణపర్యాలోచనమునకు పని గల్పించు పూర్ణపదార్థము పరిశీలనము పూర్ణమునకు కట్టెదుటనుండుట ముఖ్యము. విశ్వదాత సంపూర్ణ జీవితమును పరీక్షించినపుడే హృదయస్థ ప్రాణమాత్రమెట్లందు చలించిన భావనిచయ మెట్టిదో కన్గొనగలము. ఈతని జీవిత చరిత్రమందలి బహుభాగాంశములను పూసగ్రుచ్చినట్లు తెలుపుట నా ప్రస్తుతాశయము కాదు. మానసికయవనికపై నీచరిత్రమందలి అద్భుత దృశ్యములను విలోకించి, వీని నిహితార్థమును, వీనిని ప్రాణప్రదీప్తము లొనరించిన ఉజ్జ్వల భావశబలతను, వీనిని మహోత్కృష్టములు గావించిన గంభీరతత్త్వమును కనుగొనుటే నా ప్రస్తుతోద్దేశము.

ఆంతరంగిక నయనముల్ వాల నీయుద్దేశమును నిలిపియే ఏతాదృశవివేచనమునకు గడంగితిని. మహాపురుష జీవితచరిత్రము నాకొలంది కొలది మథించి, నే బడసిన నిగూఢతరకల (వీని గుణపరిశీలన మొనరించుచు) పాఠకలోకమున కొసగుచున్నాను. తత్త్వార్థప్రకాశకము పురికొలిపిన వివిధ జీవితాంశములను హృత్పీఠి నునిచి, భావపంథయందు పఠితలకు చేయూతలగు [illegible] నిందు నిలుపుచుంటిని.

ప్రధానాశయమున కుపశాఖలైయుండు భావపరంపరలకు (ఔచిత్యమునకు భంగము రాని తెఱగున, రసమునకు చెలుపురాని తీరున) తావొసగినగాని తత్త్వార్థమందలి లోతు మానసగోచరము కాదు. చిత్తమున కాయాసము గొలుపక సామాన్యపాఠకుల దృష్టి నాకర్షించుటకును, జటిలభావార్థము నవలీలగ హృద్గతము గావించుటకును సముచిత దృష్టాంతములను విషయతత్త్వమున స్వయంభువులై యుదయించు అలంకారములను రచనమున ప్రవేశపెట్టుట గ్రంథకర్త కర్తవ్యము. ఈసాహితీ సూత్రముల నెఱుంగు టొకటి. వీనిని స్వీయరచనమున ప్రయోగించు నేరిమినందు టొకటి. కలము చేబూని హృదయపూర్వకమైన ప్రయత్నము చేయుచు పరితోషమందుచుంటి నంతియే! కాని ఈనేరిమి నందితినో లేదో విజ్ఞానదృష్టిగల పాఠకులే నిర్ణయింతురుగాక!

భూగోళమున పెద్దంజలువేసిన ప్రజ్ఞాధురీణులు ఈగోళమును ధిక్కరించు గోపురశిఖరాగ్రములపై పుట్టలేదు. భూగోళపథమున పతితే పతితే చేపట్టినను, వీరిజన్మస్థలము లందు కానరావు. ఉత్కృష్టజీవులకు పురిటిల్లయినవి మాఱుమూల లనుటకు ప్రపంచచరిత్రల నుండి బహుళదృష్టాంతములను పేర్కొనవచ్చును. మహాపురుషులకు, మహానదులను, దేవతలను కనినచోటు లెట్టివియనికదా మహాభారతము వచించుచున్నది! సూర్యభగవానుని చూచుడు. ఇతడు మింటికొనపై నుదయించునా? ఆదర్శకర్మవీరుడై, తనకర్మక్షేత్రమున నీత డెంతో శ్రమించిన యనంతరమే విహాయసాగ్రమున మహోజ్జ్వలుడై తోచును!

దేశోద్ధారకుని కీర్తివల్లరి దేశమం తల్లుకొన లందు ప్రాకినయనంతరమే ఈతడెవ ఫుట్టినచోటెద్ది యని జిజ్ఞాసువు లరసిరి. అంతకుమున్ను ఎలకుఱ్ఱు ఎందున్నదో ఎందఱెఱిగిరి?

ఎవ్వరు తెలుగవియాఱిలో మిఱ్ఱుపల్లములందు, ముగ్గలతొట్టియలో పెరిగినశిశు వీత? ఆంధ్రమాత హృదయమున నద్భుతశక్తియై నిలిచి, మహాజ్యోతియై, పరంజ్యోతి గలయు శిశు వీత? నిష్ఠురమైన నిష్పచ్చరమున నిర్భీత ప్రాణియై పొగిలినబాలకు డీత? అవిరళ కనకవృష్టి గురియించిన ఘనహృదయుడై, అసంఖ్యాకుల అశ్రుధారల నభిషిక్తుడై, సుమవిమానారూఢుడై అమరపురికరిగిన విశ్వదాత యీత? దిగ్దిగంతములో నిండిన యీత? వేల్పుగడ్డకి వదాన్యత నెలుప నేనిన దొడ్డకీర్తి యీత? మోకాలందు తప్పటడుగు లిడిన బడుగుబాలకు డీత? కల్పకమై నందనమున నేడు నెలకొను శిశు వీత? దారుణజీవిత ప్రవిదారణమున దారి గానక తారాడిన నిరీహ డింభకు డీత? బహుళ కుసుమోన్మేష ప్రభాజాలము వెలారించిన వీరవతంసుడై, వీరస్వర్గమును జూరగొనిన త్యాగి యీత?

జయా ఫిల్మ్స్ వారి

# మహానంద



కళాసృష్టికి పరిపుష్టి నొసంగి
కావ్యశిల్పానికి వన్నెలుదిద్దే
కళాప్రపూర్ణులు
మా సాంకేతిక శాస్త్రజ్ఞులు
భారత భాగ్యోదయానికి
ప్రబలకంటకంగా ఉండేపడుపు
వృత్తిని నిర్మూలించి స్త్రీ సంఘాని
కంతా జీవం ప్రసాదించే
శీలప్రభావం

**మా కథా వస్తువు**

అభినయచాతుర్యంలో ఆంధ్రా
వనినంతా ఆనందవార్ధి
ధినోలలాడించి ఆంధ్రుల అభి
మానాన్ని మారగొన్న
ఆణి ముత్యాలు

**మా నటీనటులు**

ఆధునిక పరికరాలలో
అమర్పబడి ఆంధ్రేతరులకు
సయితము అబ్బురపాటు
గల్గించిన ఆంధ్రకళా
లక్ష్మీకాటపట్టు మా స్టూడియో

ఆదరించడం మీ వంతు — ఆనందింపజేయడం మా వంతు

తారాగణం

కృష్ణవేణి - అద్దంకి - పారుపల్లి - బాలసరస్వతి మొదలగువారు.

వివరాలకు:— జయ అండ్ కో., మిర్జాపూర్ హౌస్, మైలాపూర్, మదరాసు.

అణువై మనుజాలందు మందరగిరి యును పెట్టినా, పెండ్లిగోడలందు మొదట మసలి, ఒక వంక కులాచలములతోడను, వేఱొకవంక హిమాద్రితోడను, మఱొకదిశ మేరుమహీధ్రముతోడను, ఇంకొకదిశ హేమవసుధాధరముతోడను సెకపక్కములు పలుపు జీవితోన్నతి నందు పెట్టినా, ధూళిలో పుట్టి ధ్రువతార కాంతులు పెట్టినా, నక్షత్రాలలో తోలి యాడుగిడి, ఆజాండమున నిండు తుదియడుగిడజాలు పెట్టినా యూహింపుడు. అనిర్వచనీయమైన యీతాదృశ మహోన్నతి సందర్భాలు మహోద్భుతశక్తి మనుష్యహృదయమున కలదని సుగ్రహించినవారు మనుష్యులం దెంద రుందురు? సుందెలోనికి చూడ్కి నిగిడించి, అందలి ప్రదీపమునకు మహోద్వేగమున తేజేలు పోయగలవారు మానవులలో నెంద రుందురు? ఇట్టివారు యుగయుగములందు కడుంగడు నల్పసంఖ్యాకులై జనింతురు. అసాధ్యములు వారలట్టి కనక్కలై, వీరిచుట్టును దిరుగును. దిక్పాలకులు వందిమాగధులై, వీరిపక్క నిలిచి గుణసంకీర్తన మొనరింతురు. వీరిచరణోపాంతములందు తపోదీక్షనంద సురపురవాసులు సందర్శనమున భూతలమున నవతరింతురు. వీరి గుణమణిద్యుతుల నొజ్జబంతు లానరించుకొన గ్రహతారకౌఘంబు మిక్కిలి మక్కువ పడును. హరి హర పద్మజాదులు వీరిజీవితాంగణములందు నిలిచి, ఐక్యకంఠమున నానంద గీతిక లాలపింతురు.

మహాపురుషులందు వీరు తిలకాయితములు. అనంత కాలపథమున పాంథులై యుగములును, మహాయుగములును కడచుచుండ నే మహాత్ముండో (కృష్ణపక్షాంతమున సన్నని గడియలనో దాటనిచ్చి నింగి నొకవంక దోచు చంద్రవంకచందమున) ఏ రుదయింతురు. పంచయుక్తములైన చిన్ని వెలుగుల మహోజ్జ్వతియై తేజరిల్లులీల, బహు భవ తపః ఫలముల కలయికవలన వీరిజీవితములు స్ఫష్టిమై ప్రకాశించుచుండును.

నాగేశ్వరరావు తపస్వి. ఈతని మహాత్మ్యప్రజ్ఞయిముకొనిన తపోభూమి మిగుల విశాలమైనది. ఇం దతి మజిలీలు పలుపుచున్నది. పెక్కు మజిలీలు కడచినవి. తరువాతి మజిలీ సాధారణముగ మఱింత మహిమోపేతమై యుండును. దేశ మింకను సంపూర్ణసముద్ధరణమును నందలేదు కదా! పరహితార్థమై కడపటి మజిలీ కడపులకై దేశోద్ధారకుడు తపోభూమియం దింకొకమా అవతరించును.

తన యంగీయాంచలి ప్రత్యంగుళ మునుండియు పైకి వెడలించి అర్థిజనుల కర్పన మనిన విశ్వదాత, తన శరీరమునుండి కండలు కోసి యిచ్చుటకై మనమున్నలో మరల బుట్టును. ఎముకలేనిచేతితో ఆశ్రితులకు కాసు లొసగిన మహాపురుషుడు, అసంఖ్యాకుల రక్షణమునకై తనవెన్నెముక నూడ బెఱుకు మహాత్ముడై యుదయించును. ఈశ్వర ప్రసన్నత నందిన మహితాశయులకు విజయము చేకూర్చుటకై పరార్థజీవులు తమ ప్రాణములను నివాళిగా వర్పింతురు. ప్రస్తుత ప్రపంచపరిస్థితులను పరిశీలించుతఱి, ఇట్టి నివాళి ఎంతేని అక్కఱయైయున్నదని, నేనును భావికాలమందును ఎన్నేని దీపకళికలు తేజరిల్లవలెనని గ్రహింతును. జగతినుండి పంకిలము గతింపవంతవఱకు మహాపురుషులు తమభద్రప్రాప్తికై ప్రాకులాడెదరు. తమదృష్టిలోని శాంతిపరిపరమున విజయకేతనము తలయెత్తనంతకాలము స్వర్గలీసులందు పారిభజన మొనరించుటకై వీరు సమ్మతింపరు.

ఎలకుట్టులో పుట్టిననేమి, ఎడారిలో పుట్టిననేమి, గతికాలమునుంచి తిరసా వరించుచు నుదయించిన జిజ్ఞాసువు అలసభావము నాశ్రయించి, అడిగిముడిగి యుండనేరదు. కదల మెదలక బొగ్గ పడియుండును గాని నిప్పు నెరసు పడియుండునా? నన్నడిగితిరా, నిరసులోని ప్రత్యణువు ఉజ్జ్వలదీప్తిగల నేత్ర మందును. నెరసుహృదయమందు ప్రజ్వలించు పరార్థకాంక్షయే బహుళమునైన దానిమాడ్కిలందు తేజరిల్లుచున్న దని వచింతును. తన దీప్తికతన నెరసు తనజీవితాశయసిద్ధి నందును. తపస్వి తేజస్వియై తన యుత్కృష్టాదర్శముల నందుచు ధన్యజీవి యగును.

కన్గరగల మిణుకులు హృదయకుండమునందలి జిజ్ఞాసానలమునుండి వెడలునెరసులే! ఉజ్జ్వల ప్రాణమును, చలనమును వెలుగునకు స్వతస్సిద్ధములైన గుణములు. తేజఃపూరిత నేత్రుండైన జిజ్ఞాసువు—హృదయమున యజ్ఞకుండము నిడికొనిన జిజ్ఞాసువు ఎంకుపోసనూపిన నేమి, ఏయబ్బకడుపున పుట్టిననేమి, ఏయమ్మ పొత్తిళ్లయందు పెరిగిననేమి, ఉదాత్తమైన తనజీవితోద్దేశమునకు చూడ్కి నిలిపించి యుంచి, ఏయంకిలిని లెక్క సేయక, ఏయడలును గుండెతలపుపై తట్టనీయక దానిదెస నడచిపోవును.

తండ్రి బుచ్చయ్యగారు నాగేశ్వరరావు పుట్టినచోటులోనే యుండవలెనని వాంఛించిరి. కాని బాలుని ప్రకృతి సుఖకరమైన గృహజీవితమున కట్టుపడియుండుట కంగీకరింపలేదు. నాగేశ్వరరావు రెక్కలు కట్టికొని భారతవియత్తలమున నెగసినాడు.

నెరసు ప్రజ్వరిల్లుటకు వాయువులను తోడ నువదుపున జిజ్ఞాసను తేజఃపూరిత మొనరించుటకు సహృదయుల ప్రోత్సాహము సహకారి యగును. నాగేశ్వరరావున కిట్టిప్రోత్సాహము సుగూర్చిననవ్యక్తులు పలువు రుండిరి. జగద్ధాత్రిని దలపించు జనయిత్రియే తొలుత వీతనిని బందరున కంపెను. ఈయమకతన తా నాంగ్లవిద్య నందుటచే, కాలక్రమమున తన పొంతయూరున వెలకొలిపిన పాఠశాల కీత నామె పేరు పెట్టినాడు. శ్యామలాంబ జగద్ధాత్రికి రూపాంతరమేకదా! నాడే నాగేశ్వరరావు యాత్ర ఆరంభమైనది. మఱి ఘట్టమైన మదరాసున నీతడు కొంతదనుక రెంటాల వేంకట సుబ్బారావు కేలూత నందినాడు. మన మహాపురుషులలో

1. సుబ్బారావుశక్తి అద్భుతమైనది; ప్రత్యేకమైనది. ఒకరు నడచిపోవు పుంతయందుకాలిడుట ఈతని ప్రకృతికి ప్రతికూలము. ఒరుల మనసులకు తట్టనితలపు లీతని చిత్తమునుండి వెలువడు నదయిందుచుండెడివి. సహజశక్తిసంపన్నులైన సమకాలికులలో దక్షిణాపథనియం

పనిపులను శిక్షణాసంస్థయైయుండిన క్రైస్తవ చే అచటి ప్రధానాచార్యులై యుండిన మహా నాగేశ్వరరావునకును కొంతకాలమైన తెలు కళాశాలయం దీతడు విద్యార్థియై యుండుట వీరుడు, డాక్టర్ మిల్లర్ ఆదర్శజీవితము గొప్పగ పని నా యభిప్రాయము. బాలక

---

దీత డద్వితీయు డని చెప్పనొప్పను. ఈతని పాండితి సర్వతోముఖమైనది. సాహిత్యమును, తత్త్వశాస్త్రము నొకే కంటజూచి రెంటింటిని చక్కగ జీర్ణించుకొనిన ఆధునిక విద్యాధికులలో వింధ్యపర్వతముల కివల నీతడే మొదటివాడేమో! ఆంధ్రమందును, ఆంగ్లమందును, సంస్కృతమందును సమానమైన పాండితి నందిన దిట్ట ఈతడు. ఆంగ్లమందును గూడ చక్కని కైత చెప్పగలనేర్పరి వేంకటసుబ్బారావు. కథలను, వ్యాసములను పద్యములను వ్రాయుటయం దీతడు సిద్ధహస్తుడైనాడు. శృంగారముతో తుందిలమైయున్న ఈతని "సురాభాండేశ్వరము" పెక్కండ్రు కవుల దృష్టి నాకర్షించినది. ఇందలికథ నైతికవిధుల ననుసరించి నడువలేదు. అట్లనిన పచ్చిశృంగారముపరమాశయమై యిందు ప్రవేశించెనని తలపరాదు. ఉచితమైన పట్టున మనసు పలరించు తాత్త్వికభావమును వేంకటసుబ్బారావు తళుక్కుతించువాడు. వాడి కోరలతో విజృంభించు సంఘదురాచారముల నవలోకించినపు డీతనిగుండెచప్పుడు మిక్కుటమయ్యెడిది. తన హృదయవేదనమును తనరచనమున ప్రతిధ్వనింపజేయువా డీతడు. నిరంతర మీతని చెవిబడిన వితంతు విలాపము లీతని "కమలాలేఖ"లందు అక్షరస్థములై అసంఖ్యాకుల మనములను కదలించివేసినవి. ఈ గ్రంథప్రతు లిరువదియైదువేలు అవలీలగ చెల్లిపోయినవి. కాళిదాసుపై పూలుచల్లును ప్రతిదిన మీతడు నిజాంతరంగమున షేక్స్పియరునకు ప్రణమిల్లువాడు. శృంగారకవిత్వమున కాళిదాసందిన మహోన్నతస్థానమును గుఱించి సర్వతోముఖమైన షేక్స్పియరుప్రజ్ఞను-మహోజ్జ్వలమైన షేక్స్పియరుప్రతిభను అనవరత మీతడు ప్రస్తుతించుచుండు వాడు. అంతటితో మిన్నకొనియుండక సహజపరిశీలనాశక్తిని, స్వతంత్రపర్యాలోచనాప్రజ్ఞను పురస్కరించుకొని ఆంగ్ల మహాకవి నాటకములకు చేవగల వ్యాఖ్యానములు వ్రాయుచుండువాడు. "ఒథెల్లో" నాటకము నెడల నాకుగల గాఢానురక్తిని గమనించి, వేంకటసుబ్బారావునకును ఆమహానాటకమునెడల నట్టిప్రీతియే యుండెడిదని పండితకవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నాతో చెప్పిరి. తన సంస్కృతపరిజ్ఞానము కతన ప్రాచీన భారత భావస్రవంతి ఎట్లు ప్రవహించెనో ఈత డెఱుగువాడు. తన యాంగ్లభాషాపరిజ్ఞానమువలన ప్రతీచీ వసుంధరలో క్రొత్తపోకడలతో ప్రవహించు భావనిర్ఝరిణి నీతడు కన్గొనువాడు. ఈ యెల్లలకును, ఆ యెల్లలకును తనహృదయమును సంగమక్షేత్ర మొనర్చుచుండువాడు. ఇందుండి అపూర్వమైన భావపూరమును గ్రహించి, తన రచనలందును క్రియలందును జొప్పించువాడు. ఈతని భావశబలతయందు ప్రకటితమైన సహజశక్తి ఈతని క్రియాసఫలతలో గూడ ప్రకాశమగుచుండెడిది. ఈతని నిఘంటువులో "దైన్యము"నకు, "నిట్టూర్పు"నకు చోటుండెడిదికాదు. ఈతని యూహకు పరిమితిలేదు. కావున నిముసములో చక్కని యుపాయమరసి, కష్టమగుట వెక్కిరించుచు నిలిచిన ఇక్కట్టునే త్రుటిలో పల్టీకొట్టించువాడు. సాహిత్యమేమి? వైద్యశాస్త్రమేమి? న్యాయశాస్త్రమేమి? మూడింటికిని పొందుగూర్చి తన బొందిలో నిలుపుకొనిన అద్భుతశక్తి సంపన్నుడు సుబ్బారావు! పాండితిని, ప్రతిభను, క్రియాకౌశలమును తన పట్టపురాణులు గావించుకొనిన ఆంధ్రదశరథు డీతడు. న్యాయవాదియై విజయుడైనను, పుంతలోని మేకలమేయుట కిచ్చగింపని మనుష్యుడగుటచే, వల్లగొనుట బుట్టదాఖలా చేసి సొంతమందుల చేర్చి కూర్చి నవ్యవాణిజ్య మార్గములగుండా జగతిమీదికి వానిని పుత్తెంచువాడు. నాలుగుద్వారములనుండి గజ్జెలందియలు ఘల్లుఘల్లుమన రమాసతి ఈతని నట్టింట ప్రవేశించినది. లక్ష్మీదేవి నీతడు తన యినుపపెట్టెలో కట్టియుంచలేదు. ఆర్తులు ద్వార సమ్ముఖమున నిలిచినపు డామెను నట్టింటినుండి వారిగోడు దీర్ప బంపువాడు. నిరుపేదలైన విద్యార్థులకు పెంపుడుతండ్రియై ఉచితసాహాయ్య మొనరించుచుండువాడు. చదువరులకై ఈత డొక వసతిగృహమును నెలకొలిపినాడు. తంబుచెట్టివీథిలో ఇపు డాంధ్రపత్రిక యున్న నెలవున వసించుచుండిన నాగేశ్వరరావు, (తా నొకప్పుడు పేదవిద్యార్థియై యున్నచోటునందే పదంపడి తన విజయధ్వజమును ప్రతిష్ఠింప జాలినందులకును, పల్వురకు నెలవు నీయజాలినందులకును విశ్వదాత ఎంతో యానందించుచుండువాడు) కొండా వేంకటప్పయ్య, ఎన్. ఎస్. సుబ్బారావు (ఇత డిపుడు మైసూరులో విద్యాశాఖయందు డైరక్టరుగా నున్నాడు)లు వేంకటసుబ్బారావుదృష్టి నాకర్షించిరి. నాగేశ్వరరావు గుండెలో రగులుచుండిన సెగను తొలుత గుర్తించిన మహాపురుషు డీతడే! గుర్తించి, సహృదయుడగుటచే, ఈయువకునకు తన మేనకోడలి పద్మాంగలక్ష్మికేని, ఈతనిని తన సన్నిహితుని గావించుకొనినాడు. మానసికముగ నాగేశ్వరరావునకును, వేంకటసుబ్బారావునకును పూర్వభవమునుండి దగ్గఱిచుట్టఱిక ముండెనని నావ్యక్తిగతవిశ్వాసము. ఈశ్వరేచ్ఛ ఈచుట్టములను ప్రస్తుతభవమునగూడ కలిపినది. జిజ్ఞాసువైన నాగేశ్వరరావు రెప్పవాల్పక వేంకటసుబ్బారావు సర్వతోముఖప్రజ్ఞ నవలోకించువాడు. ఆతని ప్రబోధములకు చెవులొగ్గి, దృష్టాంతములకు కను లప్పగించి అక్కఱను దీర తన హృదయము నుద్దీపించుకొని నాగేశ్వరరావు రెక్కలను పెద్దవి గావించుకొనినాడు. స్థూలదృష్టితో పరికించితిమేని, నాగేశ్వరరావు యత్నములకు వేంకటసుబ్బారావుపూనికలు మేలుబంతు లాయెనని చెప్పవచ్చును. తనభావ్యున్నతికి చక్కనైన పునాదిని వేయునవసరమున గన్ని యిటుకలను వేంకటసుబ్బారావుపద్ధతినుండి కైకొనినను, నాగేశ్వరరావు సంపూర్ణభవన నిర్మాణమును స్వీయయత్నములచేతనే చేయించెనని సూక్ష్మదృష్టికలవ గ్రహింపగలము. "Victoria Depot"నుండి కొండొకభావమును కైకొని, "William & Co"మూలబంధమున నీతడు

# LEON TYPEWRITER Co.,

**OLYMPIA TYPE WRITER**



ఒలింపియా టైపురైటరు

**Approved by the Governments of MADRAS, MYSORE & BOMBAY.**

Agents for the World Famous OLYMPIA Typewriters—For Typing Comfort, Economy and Outstanding Durability.

**AVAILABLE IN STANDARD AND PORTABLE MODELS.**

*Dealers in:*

Typewriters, Typewriter & Duplicator Requisites and Office Stationery, Repairs of Typewriters undertaken at moderate Charges.

Andhra Insurance Buildings
5, Linghi Chetty Street,
MADRAS.

*Branch:*
7, Barrack's Road,
NELLORE.

## లివర్ అండ్ స్ప్లీన్ వ్యాధులు

పసితనమందు బిడ్డలకు లివర్ అండ్ స్ప్లీన్ వ్యాధులు, అప్పుడప్పుడు శరీరమం దుష్ణాధిక్యతతోను, మలబద్ధముతోను ప్రారంభమగును. క్రమేణ ఉష్ణము, పొట్ట పెద్దదగుట, వాంతులు, మలబద్ధము లేక ఎక్కువగా విరేచనములగుట అగును. బిడ్డకు ఆకలివేయదు. సంతోషముగా నుండదు. మూత్రము ఆరిన తెలుపుగా మచ్చకట్టును. తరువాత చర్మము, కళ్లు, మూత్రము పచ్చబారును. కాళ్లుచేతులు ముఖముకూడ ఉబ్బును. కడుపులోని రక్తనాళములు పైకి నొక్కుచుండును. ఈగుణములు గల బిడ్డను సరిగా చూచి తగిన మందు ఇవ్వనిచో మిగుల బహు అపాయస్థితిలోనికి వచ్చును.

ఈ వ్యాధిని కుదుర్చు మందేదియు లేదని వైద్య శాస్త్రజ్ఞులు అభిప్రాయపడుచున్నారు. కాని లివర్ అండ్ స్ప్లీన్ వ్యాధులు అమోఘముగా జమ్మి వెంకటరమణయ్యగారి "లివర్ క్యూర్"తో బాగుచేయబడినవనిదే యుండును నిదర్శనములు.

# లివర్ క్యూర్

వివరములకు యీ క్రిందివారికి వ్రాయుడు:—

జమ్మి వెంకటరమణయ్య,

లివర్ అండ్ స్ప్లీన్ స్పెషలిస్టు, మైలాపూర్, మద్రాసు.

యాతడు గాంధీమహాత్ముడే! ఈతని సఖ్యము కతన, ప్రోత్సాహమువలన నాగేశ్వరమనీషి ప్రతిభ కడుంగడు తీవ్రమైనది. తన సుఖశాంతులకును, ఆహార నిద్రలకును నీరువదలి దరిద్రనారాయణసేవను ప్రధానాశయము గావించుకొని ౬౩-వ యేట దొలిమారుగ, పదంపడి రెండు పర్యాయములును కారాగారమున ప్రవేశించి, భయదమైన క్షయము దెచ్చుకొని, రక్తమాంసముల నాపెనుభూతము తినవిచ్చి, సన్నిహితములైన తన యుత్కృష్టాశయములు కోటివన్నెలట్లు తన చుట్టు దేజరిల్ల నీమహాపురుషుడు దివిదిస బయనమైనాడు.

అనురాగ పూరిత హృదయుడై, భక్తిభరిత స్వాంతుడై, కళాప్రపూర్ణ డీ నలువురు వ్యక్తులపూతనామముల నుచ్చరించుచు, వీరి గుణగణముల నగ్గించువాడుకదా!

కేవల జ్ఞానసంపాదనమే జిజ్ఞాసువు కర్తవ్యము కాదు. ఉత్తుంగశిఖరమునిరికి తా జను తటి (ఈశ్వర ప్రేరణమును పురస్కరించుకొని యే యనుడు) రేలాతో యుసరవారిని, మార్గదర్శకుల ధరించి వారి భవ్యగుణములను తనవి గావించుకొని ఘనతరశక్తిసంపన్నుడగుటయు నీతనికర్తవ్యమే! జిజ్ఞాసువైన నాగేశ్వరరా వీకర్తవ్యములను తోర్మిడన నిర్వహించుచు, తన యాంతరంగిక శక్తిని, హృదయమహత్త్వమును ప్రకటించుచుండు వాడు.

తన్నుబోలు జిజ్ఞాసువుల వైజ్ఞానికపాహా చర్యను నపేక్షించినాడు. నూతన విజ్ఞాన వృద్ధికై ఈ విజ్ఞాని విశేషధనమును వెచ్చించినాడు. ప్రజ్ఞాధురీణుడైన లక్ష్మణరావుమనీషి అస్తమించిన యనంతరము ఆంధ్రవిజ్ఞాన సర్వస్వమునకై ఈత డెంతేని కృషి సలిపినాడు; సుప్రసిద్ధ పరిశోధకుడైన సోమశేఖరుని దాపున జేర్చుకొనినాడు. కళోపాసన దేశసేవనలకై సర్వశక్తులను వినియోగించు యోగులే ఈతని ఛత్రముక్రింద నిలిచిరి. ఈతడు నెలకొలిపిన పవిత్రసంప్రదాయమునకు తోహారని, ఈతని పూతకర్తవ్యమును తనది గావించుకొని ఈతనిజామాత ఆంధ్రమాత కానందము గొల్పుట కల్యాణాత్మకమైన విషయము కాదా?

తాము చెప్పటడుగు లిడిన దినములలో తమకు చేయూత నొసగినవారిని తాము పెద్దంజలు చేయుటతో విస్మరించుట తమవిధియని విశ్వసించువారును, వారిపై శత్రుత్వమంతయు తమ భవశక్తిపై మసిరాలునని యడలువారును నేడు గోచరించుచున్నారుకదా! వీరిని విలోకించి నాగేశ్వరరావుచరిత్రము పరీక్షింపుడు. ఆ దెంత యుత్కృష్టమైనదో, ఆతనిహృదయ మెంత యున్నతమైనదో గ్రహింపజాలుదురు. గుణసామ్యమువలె గుణవ్యత్యాసము విమర్శనమునకు మిగుల నావశ్యకమైన అంశమేకదా!

జిజ్ఞాసువు మనస్తత్త్వము మహాద్భుతమైనది! పలుతెఱగుల దీనిని పరిశీలింప వచ్చునుగదా!

భూగర్భమును త్రవ్వినపుడు జలము నవలోకించును. ఈనీరమున కెరటము లుండవు. జిజ్ఞాసువు గుండెలోని తొలియోచన మిట్లే యుండును. అది యవిచలితమై, ప్రశాంతమై యుండును. మనన సమయమున తపస్వి మనసు పాతాళగంగవలె నున్నచేమి, ఉద్దేశసిద్ధి నందిచరితార్థతగన నిశ్చయించినంతన, నది విశేషముగ చలించి కైలాసశిఖరాగ్రమున విడియబోవును. కొండకొనపై నిలిచి, కదలమెదలక నక్షత్రపుంజమును విలోకించు టొకటి; దృష్టి బడిన తారకల జేరుటకై అవిరామముగ వియత్తలమున రెక్కల నాడించు టొకటి! ఎందో మిన్కు మిన్కుమను తలపులు వెలయుచున్నవని, ఇవి తనకేల యని జిజ్ఞాసువు మిన్నకొని యుండడు; ఒక్కటొక్కటిగ చుక్కలను తనయిక్క కేర్చుకొనవలెనని నిశ్చయించి మానసికముగ నీత నూర్ధ్వగమనికకు గడంగును. దీర్ఘయోచనమున బడుంగున మునింగియుండక బహుళశక్తుల నంది, చిన్నముద్దవలె బ్రహ్మాండము వరచేత నిడికొని పలుకడలచు అద్భుత ప్రాణి ఈతడు! యోచనసమయమున వీని మానసము పూజామందిరమందలి కృష్ణవిగ్ర

---

ప్రవేశపెట్టియుండును. ఇదియే క్రమక్రమముగా పెరిగి "Amrutanjan Depot" యాయెనని తెలుపవచ్చును. కాని ఇది యేమి? అది యేడకే నేడిది గగనమును చుంబించుచు, బహుదేశముల మాడ్కుల నాకర్షించుటలేదా? పెద్దంజలు వేయుచు మదరాసును, వేంకటసుబ్బారావును విడిచి పోయినను నాగేశ్వరరావు ఈనుతిమంతుని యెడల గాఢానురాగము గలిగి యుండువాడు. సుబ్బారావు దివంగతుడైన యనంతరమాతని పవిత్రస్మృతిపై ఈత డనవరతము పూలుచల్లునాడు. ఎవ్వరైన తన జీవితచరిత్రను వ్రాయ నుంకించినపుడు "వేంకటసుబ్బారావుగారి చరిత్రను వ్రాయుడు. ఆతడు మహానుభావు" డని దేశోద్ధారకు డనుచుండువాడు. దినమణికరణి వెలింగిన విశ్వదాత జీవితమునకుమున్న వేంకటసుబ్బారావుజీవిత మరుణోదయమై యుండె నని చెప్పకతప్పదు. రెండింటిపై రెండుకన్నులుంచినగాని ఈయుజ్జ్వల జీవితములందలి సంపూర్ణ సౌందర్యము తెలియగజాలము. దివంగతుడైన దేశోద్ధారకుని జీవితచరిత్రను వ్రాయుభాగ్య మెవ్వరికి లభించునో తెలుపజాలము. ఎవనికి లభించినను ఈ ప్రధానాంశమును దృష్టియందు నిడికొని, ఈ మహాపురుషుల జీవితములందు వెలసినసంబంధ బాంధవ్యము నుచితరీతి నుల్లేఖించుగాక! అట్లొనరించినపుడే విశాలహృదయుడైన నాగేశ్వరమనీషి అమృతాత్మ ఆనందించును. నిక్కమైన అంశములపై నాధారపడిన జీవితచరిత్రలును, విమర్శనగ్రంథములును మనలో కొఱవడి యుండుటచే వేంకటసుబ్బారావు జీవితమహత్త్వముగాని ప్రతిభాతత్త్వముగాని ఎఱిగినవా రెందరో లేదు కానంబడుటలేదు. "ఆంధ్రమహాపురుషుల"లో గాల్క్రమమున నీపేరున కవితకెక్కలి నీయ నాశపడుచున్నాను. నాయుద్దేశమును పాఠకలోకము ప్రసన్నదృష్టితో వీక్షింపదా?

హిమమువలె కరిగిపోవుచున్నను, స్వీయకురుక్షేత్రమున నీతడు తన యరదమును నడుపగడంగి నంతనవది పార్థసారథుల జరచర గమ్యస్థానముదెస సాగిపోవును...

తపసు తీవ్రమైనకొలది జిజ్ఞాసువు హృదయమునుండి వహ్ని వెడలును. తపోవహ్ని యంతటి తేజ ముండదు? ఎట్టియవ్యక్తశక్తి ప్రజ్వలింపదు! ప్రశాంతాశ్రమములందే తపోవహ్ని జ్వలించుచుండునని పురాణములను పరిశీలించినపు డేల కన్గొందుమో గ్రహించితిరా?

ఈతనిహృదయము ప్రభాతసమయ శిశిరబిందువును పోలిన దనికూడ దెలుపవచ్చును. మంచుతుంపురు పచ్చని గరికపరక నిలుచును. కాని దీనిదృష్టి సూర్యభగవానునిపై నిబద్ధమైయుండును. తాను అణుమాత్రమైనదానని, భాస్కరుడు తనకంటె కోటికోటిమడుంగులు పెద్దయని ఎఱింగియు రవికిరణముల నలవఱచుకొనవలె ననియే ఇది కాంక్షించును. దీని ఏకాగ్రదృష్టియం దీకాంక్ష కేంద్రీకరింపబడి యుండును.

వేడికిరణము తేజఃపూరితమైన సూర్యగోళమునుండి ప్రసరించునట్లు, ధూమరేఖ భగభగమండు నిప్పుగుండమునుండి వెడలువడుపున నేకాగ్రదృష్టి మనువుల కందని మహోజ్జ్వల జిజ్ఞాసనుండి వెడలును. సమిధ లధికమైనకొలది కీలికీలలు వేగవంతములై రెగయును. తపస్స్పధికమైన కొలది దృష్టిలోని తేజస్సు ఘనతరమగుచుండును. సమిధలు జ్వలించుచు వేడిమిని హెచ్చించుచొప్పున, తపస్సమయమున నాంతరంగికశక్తులు హృదయకుండమున సుజ్జ్వలములై విజృంభించుచు, కనలేని వెలుంగును బుట్టించుచు, దానిని దృష్టిలోనికి పుత్తెంచును.

ఏకాగ్రదృష్టి కొకవంక బరమాశయమును రెండవవంక బూర్ణావ్యక్త హృదయశక్తులును ఉండును. చేతివండము మూలమున పరశురాముని శక్తినంతను శ్రీరాముడు తన వశమొనరించుకొనినట్లు, తపఃప్రభావమున ఘనతరశక్తులనందిన మనుష్యహృదయము ఏకాగ్రదృష్టివలన పరమాశయమును తన సొమ్ముగావించుకొనును. అద్భుతమైన యీనిమిత్తము వలననే ఇది వైకుంఠధామమునుండి శ్రీవిష్ణువును దనలోని కాకర్షించుకొనును.

ఇట్టి దృష్టికతన ప్రాతఃకాల శిశిరకణము సూర్యమండలమును తన గుండెయందు చేర్చుకొనును. రెప్పవాల్పక మంచుతుంపురును పరికింపుడు. బిందుసుందరి హృదయాంతరాళమున వివిధ రాగములతో తళ్కొత్తు వేయికిరణములు మీ కనులకు విందొనరించును.

జిజ్ఞాసకాలవాలమైన గుండె అణువుకంటె పెద్దది కాకున్నను, తనకు ద్రవ్యమును త్రవ్వి పోసికొనదు. దైన్యమునుగాని, దుఃఖమును గాని దరిచేరనీయదు. మార్తాండునిదృష్టి మహదాశయమును తన తపఃఫలముకతన తనయది గావించుకొనును! జిజ్ఞాసువులు అతికాయులు కారు. మహాకాయులు కారు. వీరి తపసు అత్యద్భుత మగుచు బ్రహ్మాండము కోహినూరుమణివలె వీరిగుండెలందు చేరకొనును. మంచుసుబ్బలిలోని గుహాలందు తపోధనులు మనియుండువా రని వింటిమి. నన్నడిగితిరా వీరి గుండెలను గుహాలందే వీరి తపసుచే నాకర్షింపబడి, గగనమునుండి హిమాద్రి కాపుర ముండెడిదని వక్కాణింతును.

ఆత్మవిశ్వాసమునకును, ఏకాగ్రదృష్టికిని అవినాభావసంబంధము కలదు. గుండెలోని విశ్వాసము చలించినపుడే దృష్టినుండి పరమాశయము చెదరిపోవును. ఆత్మవిశ్వాసము, జిజ్ఞాస, తపసు, చిత్తైకాగ్రత సాహసము ఎడబాటు నెఱుగక, పాండవుల ట్లుండి తమ ధర్మక్షేత్రమును మహాపురుషహృదయముల గాంచి, దానిని తమ నెలవు గావించుకొని, శంఖములు పూరించునదమునకై తపసి యుండును. వీని కీశ్వరసాహాయ్య మనివార్యమనుట స్పష్టాంశమేకదా! నేచేరొక్క మహాపురుషు లీశ్వరునిపై మనసులు నిలిపి ఈశ్వరాలోకమున వెలుంగువారే!

మనుజుని భావ్యున్నతిని ముందే తెలిసి అక్కరమైన తెన్నున (ఇది కష్టభూయిష్ఠమై యుండవచ్చును) వానిని నిలిపి, వాని కురుక్షేత్రమును తానే నిర్ణయించి, ఈశ్వరు డాతని నందు నిలుపును.

"నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్" అని కదా భగవంతుడు పలికినాడు. ఒక్కొక ఉత్కృష్ట కృత్యమును నిర్వహించుటకు జగదీశుడు భవపరంపరల తపసుకతన సర్వాత్మ సంసిద్ధవరు నొక్కరుని దన నిమిత్తముగా చేకొనును. సంపూర్ణ భావమున నీబాధ్యత నివ్వటిల్లుటకై పలికిన వ్యవస్థ నీశ్వరుడే కావించును. ఈనరుని తలపులందు తానే తేజరిల్లి, ఈతని క్రియలయందు తానే అవ్యక్తుడై నిలుచును. కావున నీపూరుషుని భావములును, క్రియలును, వాక్కులును, నడకలును ఈశ్వరప్రేరితములే కదా!

సర్వతోముఖమైన ఆంధ్ర సముద్ధరణమున కక్కరమైనవ్యక్తి నాగేశ్వరరావని జగదీశు డాతని నెన్నుకొనెను.

తాను నిర్దేశించిన ధనువును చేబూనవలయు నీతని చెవులందు, ఆత డుదయించిన ముహూర్తమున జగదీశుడు తనయుద్దేశమును తియ్యని గుసగుసలతో నూదిపి జారవిడుచును. శిశుహృదయము చలింప మొదలిడినపుడే ఈయుద్దేశ మాచలనమున ప్రవేశించును. ఈ డింభకుని గుండెకడ చెవి యొగ్గి వినుడు. ఎడందచప్పుడున దివ్యశక్తి కలదని గ్రహింతురు. హృదయమునుండియే రుధిరధార లంగప్రత్యంగములలోనికి ప్రవహించును. ఉత్కృష్టభావ మిందే యుదయించి, Pineal gland ను కదలించి మెదడును తట్టు నని మనశ్శాస్త్రవేత్తలు నే డనుచున్నారు. హృదయస్థ ఈశ్వరోద్దేశము, ఆయువుపట్టున తొలుత తేగంట మ్రోగించి అంతరంగమును ప్రతిధ్వనింపజేయును. ఈతని రక్తనాళములందును, ధమనిస్నాయువులందును, మేధయందును ఈశ్వరోద్దేశము వెలసియుండును కావున నీతని భావగమనమును, జీవిత గమన

వాలి దృష్టినున్న విషయమునుండి దానిని దూరముగా నెట్టివేయును. ఇట్టి పఠనాగమనిక విషయగ్రహణమునకు తోడుపడక, విషయమునుండి దూడ్కొని తలచి, దూరముగ నేపుంతలలోకో గిరవాటు వేయును. కావున సహజరీతిని మనసును నడువనిచ్చి చదువువాడే, అవలీలగ విషయమును హృద్గతము గావించుకొనును. కేవలము చదువునకే కాదు మనసునకు సంబంధించిన ప్రతి క్రియపట్ల నీసత్యము చెల్లును. కఠినంగను క్లిష్టమైన విషయము ప్రత్యక్షమైనపుడు (నల్లరాతిని బద్దలు కొట్టుటకు వాడినపనము అక్కరలనట్లు) వాడియైన చూడ్కునే సతత ప్రయోగింపవలెను. కింగ్ కాంగ్ మగాని లేని సాక్కను గాని గామా ఢీకొనునపుడు సమయము చరచర నడువవున్నను అది దుర్వ్యయము కాదు. ఈతనిశక్తి అక్కరైనపని దొరకుదు గావున నది ఘటనరమే యగును. విషయము బలిష్ఠమైనపుడు సర్వశక్తులను తనలో కేంద్రీకరించుకొని మనసు దానిని మార్కొనుకో దానిదృష్టి చెదరిపోదు, దాని క్రియ వ్యర్థవిజృంభణము కానేరదు. కైబరు కనుమలోని కరిగి చూడుడు. కొండసొరంగమున జొచ్చుతటి ధూమశకట మల్లనల్లన నడచుచుగాని దూదిపింజవలె నెగిరిపోదని గుర్తింతురు. రెండుతీలుల శక్తులు మార్కొననపుడు వానిగమనసంస్థ మల్లోక తెలుకనమందు నని భౌతికశాస్త్ర విద్యార్థు లెఱుగుదురు. క్లిష్ట విషయములోని శక్తి చలనసహితముగ గాక చలనరహితముగనే పని చేయును (The force in it is not Kinetic but potential) సతతదృష్టి కెదురైనపుడు నతవాగమునను నది కొంత మార్పు కలిగించితీరును. ఈయంశములు వీరుని నవకపట్లగూడ వర్తించును. ఈతనిశక్తి అసామాన్యమైనదని ఈతనియుద్దేశ మత్కృష్టమైన దని తెలిపితినిగదా! పైని దెలుపబడిన చదువరి యాంతరంగిక శక్తికంటె ఈతని యాంతరంగిక శక్తి దొడ్డది. అసాధారణ ప్రతిభాసమన్వితుడైన రచయితయును, వక్తయును, ఈధీరుడును సైదోడులు. తానెఱుగని మహత్తరశక్తి యొకటి తన హృదయస్పందనమున సారథియై యధివసించుచున్నదని విశ్వసించి, ముందుగల దీర్ఘమార్గమందలి అంగుళమంగుళము ముందే పరీక్షింప నవకాశింపక ఈ తెరువరుడుగల ఫలము నెఱుగుటకై అంకెలను వేర్చుకొని తోడన "Rule of three" లెక్కకు గడంగక, మహత్తరశక్తికిని, ఆశక్తితో కలదూగు నాత్మవిశ్వాసమునకును, వానికి దైన సాహసమునకును చరిపడు గమనము నవలంబించి ఈతడు సాగిపోవును. పోవును, పోవును, తొలుత దానూహింపజాలని అద్భుతదృశ్యముల నెన్నిటినో కని ముగ్ధుడై, వీనిని తనని గావించిన ఆంతరంగిక దివ్యశక్తి నీతడు వేయినోళుల బ్రస్తుతించి, తాను దాని క్రియకు నిమిత్తమైనందులకు తనలో నెంతయో కులుకును; కాని కనులు మూసికొని ఈతడు నడువడు. చేనిలో పడిన బ్రహ్మదత్తునవలె పురోభాగమందలి తీవరాంగణమున నీతడు చొరబడడు. కష్టమటి క్లిష్టపరిస్థితుల నతివేమరగాచనుడై యవలోకించి, వానిని మార్కొను నవసరమున దనగమనమున నక్కరైన మార్పు నీత డవలంబించును. ఎదుటి శక్తి తన సహితశక్తి సంపూర్ణమైనపని కల్పించును; కావున సముచితమై, తాత్కాలికమైన దీని చలన పరివర్తనము ఈశక్తిని తగ్గించుటకు మాఱు హెచ్చించును. వ్యర్థవిజృంభణము కదా ఈశక్తికి భంగపాటును, చిత్తైకాగ్రతకు చెఱుపును, ధ్యానగతి కవాంతరమును, దృష్టికి విచ్ఛలవిడినపికను దెచ్చిపెట్టును.

ఈశ్వరోద్దేశము నొందుగుండె యుండికొని నాగేశ్వరరావు జరించెనని తెలిపితిని. అవ్వలి యవనిలో నాత్మప్రకాశము గావించుకొన దలపడు గిరిగర్భస్థజలధారవలె నీతని హృదయస్థగభీరాబ్ధిప్రాయము స్వప్రకాశముకై బహుధా ప్రయత్నింప గడంగినది. ఇది నాగేశ్వరరావును నిద్దురపోనిచ్చినదికాదు. తలిదండ్రులాపగిడి సుఖబువ్వను తినవిచ్చెడిదికాదు. నట్టింటి సంతృప్తినుండి ఈతని గదలించినది ఈ యాంతరంగిక చలనమును, ఆత్మవిశ్వాసమును, సహజసాహసమును, నైసర్గిక స్మృతిని పురస్కరించుకొని తరువాతి యాటపందిళ్ల దెస నీతడు సాగిపోయినాడు. ముందుగతిని గుణించి గభీర పర్యాలోచనము కీతడు గడంగలేదు. నాగేశ్వరరావు రాహుకాలమును మాచి పయనము కాలేదు. మైనమేషములను లెక్కించుచు దీర్ఘయోజనమును గావించినచో, నీతను హేమ్లెట్ వలె నాగిపలాడువాడు. అపూర్వ భావనివహప్రవేశమునకై హృదయద్వారమును తెఱచి, కలము బూని, సాహితీజగతిలో చరచరపోవు ప్రతిభాసమన్విత మహారచయితవలె వీరుడు కదలిపోయినాడు. భావిసంఘ యంతయు యవనికమీద సినిమాబొమ్మవలె నీతని పురోభాగమున గోచరింపలేదు. కనువిందొనరించు కోటివస్తు వెదుట గాంతిలలేదు. తనకై బందరు కలకత్తాలలో పచ్చతోరణములు, బొంబాయి మదరాసులలో నిత్యకల్యాణమును తడిసియుండెనని కోకిలపక్షి ఈతని వీనులందు నూదలేదు. శుభాశుభతలను చెబూచిన గ్రహరాశి నీతడు వీక్షింపలేదు.

తొలియంజలోనే విజయకేతన మెగురనగో, మలియంజ చచ్చినజే యగును గదా! సుమవృష్టిని గురియించు సురవర్గము ముంగే దృగ్గోచరమగునో, పథాగ్రముందే దేవదుందుభులు మ్రోగునో, ముందటి యడుగునందే ప్రయత్నవల్లి పుష్పఫలిత యగునేని, కేలహలమును బూనకముస్నే మంగళగీతిక లాలపించు కిన్నరకాంత లెదురయ్యెదరేని, కాలు కదల్చుటకు ముందే గులాబిసెజ్జ కమలపండు పొనరించునేని, పెద్దంజలు వేయుచు మానవులందఱును పెద్దపనులకు పూనుకొందురు. కల్యాణతిలకమును నొసట దిద్దుకొని పెండ్లికొమరితవలె కర్తవ్యము కట్టెదుట దోచునేని, అసంఖ్యాకులు పెండ్లికొమరులై జగతిని ఆత్యద్భుతమైన కల్యాణవేదికను కావించి పైతురు. పసపు కుంకుములపై చూడ్కి నిలిపి, ముత్తైపుసేసలకై శిరము లొగ్గి, కల్యాణగీతి

Phone No. 8458



**Hotel MANASAROVER**

**హోటల్ మానసరోవర్**
(స్టార్ టాకీసు కెదురుగ)

బాగుగా గాలి వెల్తురు ప్రసరించు 85 రూములతో గూడి వసతికిని, భోజనమునకు నూ సౌకర్యముగ నుండు హోటల్ ఇదియే!

తిరువల్లిక్కేణి మద్రాసు

---

# టీ

నీలగిరి, వైనాడు, పీర్ మేడ్, తిరువాన్కూరు మున్నగు తావులలోని ఎస్టేటులనుండి నేరుగా తెప్పించిన మేలురకము, ఎక్కువ సువాసనగలది, దక్షిణ ఇండియా ఆరెంజిపీకో, బ్రోకెన్‌పీకో, ఫానింగ్సు, డస్టు తేయాకు.

2 ఔన్సులు, ¼, ½, 1 పౌ. సీసము, కాగితము ప్యాకింగులోను: 25 మొదలు 150 పౌనుల వరకు టిన్నులలోను అమ్మబడును. ఖరీదు చాల తక్కువ.

యూకలిప్టస్ ఆయిల్ అమ్ముటకు ఏజంట్లు కావలెను.

**Karikar & Co.,**
ఎస్టేటు ప్రతినిధులు,
హోల్‌సేల్ టీ వ్యాపారస్థులు.
25 A, Thambu Chetty Street
MADRAS

---




స్టాకిస్టులు కావలెను.

---

**శ్రీమదాంధ్రభాగవతము**
బమ్మెరపోతనామాత్యప్రణీతము
లఘుటీకా, చిత్రపటములతో, విడివిడి స్కంధములు
చక్కగాముద్రింపబడినవి. స్కంధము (సభ్యులకుమాత్రం)
టికెరుం 8-౦లుమాత్రము ప్రవేశరుసుమురుం 4-౦లు
**వాణీనికేతనము, బెజవాడ**

---



కను దీని లొడ్డి, కట్నములకై కానుకలకై దోపిళ్లగ్గి మహావీరులు ముందంజ వేయరు. పదనైన కోరలను, వాడియైన గోళ్లను కలిగినదయ్యు, కర్తవ్యమునకు వీరు విడాకులు సమర్పింపరు. కాలక్రమమున నిది గంధర్వ భూమిని యగునని గ్యారంటీ యొసగువారు గాని పత్రము వ్రాసి రిజిస్టరుచేసి చేతబెట్టు విద్యాలవారుగాని వీరి కెదురురారు. సన్నిహితవిజయము యజ్ఞపాత్ర చేబూని ప్రత్యక్షము కాకపోయినను, తెరువులుదప్పిన, కొండకోననైన పాయసము నందిందు విజయము తడసియుండునని యెవ్వరును తెలుప జాలరు. పసుపునకిర్వంకల మల్లెలును మొల్లలును నిలుచుచో, పథికులు విలాసపురుషులే యగుదురు కాని వీరవరులు కారు. లోనిసత్తువను కొల్చునవి నిష్ఠురకష్టములు కాని పూల చెండులు కావు. దృఢనిశ్చయమునకు పని కల్పించునవి రాళ్లవానగాని పూలవానకాదు. గుండెనిబ్బరము సరియజాలునవి వేడితుంపురులు గాని పన్నీటి బిందువులు కావు. ఇచ్ఛాశక్తికి పేరుదెచ్చునది అగ్నిపరీక్షగాని సమ్ముఖ విజయము కాదు. వజ్రసంకల్పమునకు వన్నె దెచ్చునవి అగచాట్లుగాని అచ్చట్లును ముచ్చట్లును గావు, ముప్పతిప్పలుగాని ముగ్గులును మురిపెములును గావు. కాని, ఏ ప్రతికూల ముహూర్తమందైన నిరాశ హృదయమునకై దాటి పెడలకుండుటకై వీరపురుషులు తమ గుండెలందు సదాశను నిలుపుదురు. ఇది దివ్యప్రదీపము వంటిది. గుండెయను కుప్పెలో నిది వెలుగునంతకాలము చీకటిలోనే వర్ధిల్లు దైన్యమును, భయమును, సంశయమును అంతరంగమున ప్రవేశింపజాలవు. కావలసిన కారణాంతర మెట్లున్నను, మహాపురుషులు దుష్ట పరిస్థితులతో పోరుసమయమందైనను కాంతియుతస్వప్నము లల్లుదు రానంద గీతిక లాలపించుచునే యుందురు. కావున వీరివాక్కులుత్సాహపూరితము లై యుండును. అష్ట దిక్కులనుండి అష్టకష్టములు మార్కొనువేళ నెపోలియన్ "నేను యూరపును; నా కర్తవ్యము పెద్ద" దని కొండకోననుండి లంఘించి, తనదృష్టాంతమును చేయూతజేసి, అనుచరులచే లంఘింపజేసినాడు. ఈవీర వతంసుని తీక్ష్ణదృష్టిజూచి అడలుచే చుక్కలు వడకె ననినాడు శైరణమహాకవి! అసాధ్యము లీతని జూచి, కాలుకాలది పరుగెత్తి నవి! భయదమైన పర్వతాగ్రమున సంస్థితట్టను చూచి ఈతడు మీద దుముకలేదు. ఈతని సదాశయము, ఆత్మవిశ్వాసమును ఇట్టి తట్టలో పుట్టలేదు; ఇవి వానిసహజహృదయ గ్రంథమున నుదయించినవే! ప్రవంచనము తరువాత నెంతపని చేసినను, ఆవీరవరుని దీర్ఘాలోచనమందు గాని దురంత దుఃఖమందు గాని ముంచియుంచక, ఇవియే ఆతని యంతరంగమందలి అద్భుతశక్తిని విజృంభింపజేసి, దానిగళమున నుజ్జ్వలమైన కీర్తిమణిని గట్టినవి.

డిగ్రీలలో భేద ముండవచ్చును; కాని, వీరులసుగుణము లాంతరంగికముగ వ్యత్యాసము నెఱుగవు.

తన కర్తవ్యకంథరసీమయందు కల్యాణ మాల్యము విలోకింపకున్నను, నాగేశ్వర రావు నా యుత్సాహముతో, నానందముతో సహజవిధమున తన గమనము సాగించి నాడు. వాడికొమ్ములుగల అరిష్టములను డీకొనినపుడు అక్కఱనుగుతిని గతిని నిరోధించి, దృష్టిని చెదురనీయక, చిత్తైకాగ్రతకు భిన్నము రానీయక, ధృతి సాహసములను చలింపనీయక, హృదయస్థశక్తిపై సంపూర్ణ విశ్వాసముంచి ఈశ్వరభక్తుండుకావున నీశ్వర సాహాయ్యమును దివ్య గావించుకొని, ఇక్కట్టులను నెట్టివేసి, యాత్రను విశేషముగ సాగించినయనంతరము తొలుత దానూహింపని ప్రజ్ఞాప్రకటనమును తన చేయువున నవలోకించి, అంతరంగికముగ నాగేశ్వర రావు మిక్కిలి యక్కజంపడి యుండును. తనకర్తవ్య మీశ్వరప్రేరిత మని మది నెంచి, తత్కీర్తివ్యక్తీకరణమున కీశ్వర మహిమయే యుత్తరవాది యని నమ్మి, తా నందినఫల మీశ్వర ప్రీత్యర్థము ప్రజాళి చేతులందు బెట్టి, దేశోద్ధారకుడు ధన్యజీవి యైనాడు.

మహాపురుషులు అదృష్టవంతులని ఎందఱో అపోహపడెదరు. కాని అదృష్టమునకుగాక దురదృష్టమునకు వీరు మిగుల సన్నిహితులని ఋజువు చేయవచ్చును. వీరిని మార్కొను శత్రువులు మఱెవ్వరిని మార్కొనవు. వీరి సుఖకాంక్షలపై రక్తవర్షము గురియించు మారీచసుబాహులు పల్వురు కలరు. వీరి యగ్నిపరీక్ష ఒక్కనాటితో కడముట్టునది కాదు. చితిమంటలో వీరితో సహగమన మొనరించునంతదనుక నది నిలిచియుండును. వీ రెంతయున్నను(నిభృతమందు మసలుచున్నను) సహస్రదృక్కులు వీరిని వెన్నాడుచునే యుండును. వీరి హృదయమహత్త్వ మెఱిగిన సహృదయులకంటె, గభీరమైన వీరి గుండెలందు మసగీతనీదలేని మూర్ఖులసంఖ్య, —మక్కువైన మూర్ఖులసంఖ్య మిన్న. కావున పూవులకంటె ముండ్లే వీరిపై మిక్కుటముగ పడును. వీరియఖండ మనవరతము వెలుంగుచుండవలెనని వీరిసమ్ముఖ మందలి దీక్షాగ్ని నిరంతరము జ్వలించుచుండవలెను. తమ వ్రతమండపమునుండి వీరు కదలుచో నిజాంతరంగములం దొకకన్ను నిలిపియుంచుట వీరు విస్మరించుచో, వీరిని అక్కున నొక్కిపట్ట గనిపెట్టుకొనియున్న ప్రలోభములు గజ్జెలందియలతో చివాలున వీరియందు విజృంభించును. మనోహరముగ త్రోల నాట్యమాడి మోహంపు దృక్జాలమున వీరి మానసముల నాకర్షించు నగుమోము మేనకలు పూర్వోక్తదైత్యులకంటె బలసంపన్నలు. కొండొక ప్రలోభమునకు తమ బుద్ధిని కుదువబెట్టి, "వలదు! వల" దని అంతరంగమునుండి ఆత్మ యఱచుచున్నను, తమ యగ్నిహోత్రమున నీరు పోసి, చివాలున పవనవాటికనుండి యవ్వలికి లంఘించి, "ఛీ! ప్రాణప్రియా!" యని దానిని కవుంగిలించుకొని, ఈశ్వరచరణ ద్వంద్వమున సమర్పింపవలయు విరిదండచే దాని గళము నలంకరించి, అమృతబంధురమైనదని యాశపడి విషాక్తమైన దానియధర మాని పతితులైన మహాపురుషులు ప్రపంచమున

గలరు. తా మధిష్ఠించిన దివ్యసింహాసనము నుండి (శత్రుప్రహారములచే విఱిగి భూమిపై పడిన కోటబురుజులవలె) నేలగూలిన మునిరాజుల విషాదగాథల నెఱుగమా? ప్రకృతి పథమునబడయితము సుగుణములను లక్ష్యములై యున్నతలే, భావగ్రహణమునకును దైనిక జీవిత విధానమునకు నెట్టి బాంధవ్యములేని తలే, యుగవాతూలము కలుష పంకిలమై యున్నతలే, ఈ దేశములు క్రిమిబంధురములై యున్నవి, పేరుప్రతిష్ఠ లలవఱుచుకొనుటకు వలసిన వ్యవస్థలు ప్రచారమందనుడు, ప్రకటనమందనుడు, ప్రదర్శనమందనుడు అవలీలగ దృగ్గోచర మగుతలే దమతోంటిగద్దెలనుండి స్వస్వ రూపములతో (సత్య మెన్నటికిని మఱుగున దాగి యుండదు కావున) సభాలన గూలినదు పెద్దలను వీక్షింపజాలుట విడ్డూరము కాదుసుడీ. ఒకప్పుడు పూజాపీఠములందు తేజోమూర్తులై యధివసించిన మహనీయులు కొందఱు పడిపడి వికృతస్వరూపులై గోచరించి, వీరపూజాధురంధరులు చల్లినపూలను తలవంపులను, జిజ్ఞాసువుల మనస్సులకు దుఃఖమును గలిగించిరని ప్రపంచ చరిత్రలు తెలుపుచున్నవి. కార్లైలు ప్రభృతులు వీరపూజ (Hero-worship) నలిపి పలువుర నింటులకు పురికొలిపిరి. వీరపూజ దేశౌన్నత్యమునకు, జాతి మహత్త్వమునకు ఆవశ్యకమైన పవిత్రానుష్ఠానము. ఈ యుత్కృష్టకర్తవ్యమును నిర్వర్తించి కార్లైలాదులు తమ దేశమాతల కానందమును గొలిపిరి. తమపూజలందు వీరవరులు పదంపడి వెలికిలబడెదరో, ఘనతరప్రజ్ఞ నంది ఈశ్వరునకు సన్నిహితు లయ్యెదరో వా రెఱుంగజాలరైరి. మఱెవ్వరుకాని యెవ్వ లెఱుంగ జాలుదురు? పవిత్రమైన తమ ధర్మమును నిర్వహించుచే రెఱుంగగలరు. ఒరుల భావిప్రవర్తనమును గురించి రాయి గ్రుద్ది, గ్యారంటీయని కంఠమెత్తి జగదీశుడైన బలుకలేనితలే వీ రెట్లు పలుకగలరు? నాగేశ్వరరావు బూడిదపులుము కొనినఋషి కాదు కాని, తనయింద్రియ హయములను దశదిశల బరుగిడనీయని మహావీరుడు. సమక్షమునగాని పరోక్షమునగాని ఈతని చరిత్రయం దెట్టిమచ్చను వ్రేలెత్తి చూపగలిగినవా రెవ్వరును లేరు. దైనిక జీవితమున భంయమునణము నవలంబించిన మహాపురుష డాతడు. తన యగ్నిహోత్రమున నీటిబింకువులను కాని, తన నిష్కళంక చరిత్రముపై మసికితుంపురులను కాని రాలనీయని మహాత్ము డాతడు. క్రమనిష్ఠ కతన, కఠోర తప సుకతన, తా నధిష్ఠించిన శిఖరమునుండి జారిపడకుండుటయకాదు యింగ్లాండు నంగకైలాసములోనికి రహదారి నేర్పరచికొని, ఈశ్వరపక్షమున స్థానమునందిన మహనీయుడుగా రిప్పుడు నాగేశ్వరరావు.





# వాల్‌టాక్సు ఫౌండ్రి

# Wall Tax Foundry



## అచ్చుఆఫీసు పనిముట్లను తయారు చేయువారు, ఇంజనీర్లు, కంట్రాక్టర్లు

టెలిఫోన్ నెం. 3158, 157 వాల్‌టాక్సురోడ్డు,

కొండితోప్, మదరాసు.

ఆర్డరులు అతిశీఘ్రముగాను సంతృప్తికరముగాను తయారుచేయబడును.

పింటో చెక్కు (ఆయిల్ మిల్లులు) పొగాకునుపసును చేయు కొలిమి, డబ్ల్యు. ఇ. పుల్లీలు, (సింగల్ డబుల్ అమ్ము) రైస్‌హాల్లర్లు, పిండిమరలు, డిసింటిగ్రేటర్లు, గుండ్రని, సానాకొలిమికి అనుకూలించు ఇనుపఖడ్డీలు, ఎద్దులతోను, పవర్ ఇంజనులతోను వాడుకొనుటకు అనుకూలించు చక్కెరమిల్లులు, వివిధరకముల సి. ఐ. కాలమ్సు, అలంకారముగానుండు దీపస్తంభములు, నీటిగొట్టములు, మునిసిపాలిటీలకు పనికివచ్చు పనిముట్లు సి. ఐ. రైలింగ్సు, అలంకారముగా నుండు సి. ఐ. ఫైనల్సు, పానెల్సు, బ్రాకెట్సు, డంబెల్సు, సి. ఐ. గేట్సు, తోటలోనిబల్లలు, ఫా సెంటర్లు, షిఫ్టుసెంటర్లు, తేలిక, బరువైన సాకెట్లు, బాల్సుమున్నగునవి వివిధ రకములు తయారుచేయబడి, సప్లయి చేయబడును.



కాస్టింగు వర్కును, ఇంజను రిపేరు అతిశీఘ్రముగా చేయబడును.

# గోలీ శిల్పచిత్రములు



౧-వ చిత్రము : మనుష్య ప్రతిమలు



౨-వ చిత్రము : నలగిరి వశీకరణము



వెస్సంతర జాతకము

3-వ చిత్రము : రాజకుమారుడు తన 'ధర్మసత్రము'నకు బోవుట





వెస్సంతర జాతకము

4-వ చిత్రము : గజదానము



క చ

వెస్సంతర జాతకము

౫-వ చిత్రము : (క) వృషభ, (చ) శకట దానము



క చ

వెస్సంతర జాతకము

౬-వ చిత్రము : క. రాజకుమారుడు, అతనిభార్య పిల్లలను ఎత్తుకొనివెళ్లుట

చ. పిల్లలను దానమిచ్చుట



క చ ట

వెస్సంతర జాతకము

౭-వ చిత్రము : క. రాజకుమారి తన కుటీరమునకు వచ్చుట

చ. పితామహుడు పిల్లలను విడిపించుట

ట. యక్షీప్రతిమ



౮-వ చిత్రము : షడ్దంతజాతకము



# గోలీ శిల్పములు

[ఈ గోలీ శిల్పములను గురించి శ్రీ టి. యన్. రామచంద్రన్ గారు వ్రాసిన పొత్తము మద్రాస్ ఎగ్మోరు గవర్నమెంటు మ్యూజియమువారు ఒక 'బుల్లెటిన్'గ ప్రకటించినారు. దాని ననుసరించి వ్రాసినదే కథా వృత్తాంతము. అచ్చటచట ఒకటి రెండు భేదములు కలవు. — మల్లంపల్లి సోమశేఖరశర్మ.]

[ఈ సంచికయందలి గోలీ శిల్పచిత్రములు ఎగ్మోరు గవర్నమెంటు మ్యూజియము సూపరింటెండెంటుగారి అనుమతితో.]

తెలుగు దేశమున నొకప్పుడు బౌద్ధమతము ముమ్మరముగ వ్యాపించి యుండినట్లు చెప్పుట చర్విత చర్వణము. బౌద్ధనిర్మాణావశేషము లాంధ్రదేశమున అనేక ప్రాంతముల గానవచ్చుచున్నవి. ఆంధ్రచరిత్ర పాఠకులు అమరావతి, నాగార్జునుని కొండ ప్రదేశములయందు బయలు పడిన బౌద్ధకళా సంపదను గురించి యిదివర కెరిగియేయున్నారు. వాని నెరిగినంత యెక్కువగా గోలీ బౌద్ధ శిల్పములను గురించి యెరుగరనుట సత్యదూరము కానేరదు.

గోలీ యన్నది గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా యందలి గ్రామము. ఈ గ్రామమునకు వాయవ్యదిశ నొకమైలున్నర దూరమున ఒక దిబ్బ యుండగా దానిని పుదుచ్చేరియందుండు ఫ్రాన్సుదేశస్థుడు డాక్టరు జి. జే. డుబ్రాయిదొరగారి ప్రోత్సాహమున త్రవ్వినారు. త్రవ్వగా అందుండి బౌద్ధస్తూపమునకు సంబంధించిన శిల్పచిత్రములతో గూడిన శిలాఫలకములు కొన్ని కానవచ్చినవి. వాటి నన్నిటిని ప్రస్తుతము మద్రాసు, ఎగ్మోరునందలి చిత్రవస్తు ప్రదర్శనశాలలో భద్రపరిచినారు. చెన్నపురి వచ్చువారు ఆ శిల్పచిత్ర ఫలకముల నచ్చట చూడవచ్చును. ఈ సంచికయందు వాటిలో గొన్ని శిల్పచిత్ర ఫలకముల రూపము చూపబడినది.

గోలీయందు దొరకిన యీ శిలాఫలకము లన్నిటి మీదను అమరావతి, నాగార్జునునికొండ స్తూప శిలాఫలకములమీదవలెనే బుద్ధుని జీవితమునకు సంబంధించిన, జాతక కథలకు సంబంధించిన చిత్రములు చెక్కబడినవి. ఒక్కొక్క ఫలకమును పెక్కువిభాగములుగ విభాగించి, ఆ యొక్కొక్క విభాగమున కథకు సంబంధించిన ఒక్కొకదృశ్యమును చెక్కుదురు. కొన్నికొన్ని గాథలు, కథలు అతివిస్తరముగను, కొన్నికొన్ని అతి సంగ్రహముగను చెక్కబడినవి. ఇట్లు కథ చెక్కుట పూర్తియైన పిదప ఒకటి రెండు విభాగములలో మనుష్య, నాగ, యక్షాది చిత్రములను చెక్కుట యాచారము. అటు తరువాతి విభాగమున మరల నొక క్రొత్తగాథ, లేక క్రొత్త కథ యారంభమగును. ఈవిధమున అమనుష్యాది విడిచిత్రములు కథ సంపూర్ణమనుటకు గుర్తు. ఒక్కొక్క విభాగమును 'గడి' యని వ్యవహరింతము.

ఈ సంచికయందు ముద్రితములైన గోలీ శిల్ప చిత్రములలోని మొదటి చిత్రఫలకమున మూడు 'గళ్లు' కలవు. మొదటి 'గడి'యందలి ఏనుగు మొదలైన చిత్రములు రెండవ చిత్రమునకు సంబంధించినవి. తరువాతి రెండవ గడిలో స్త్రీపురుష ప్రతిమలును, మూడవ గడియందు నాగరాజ చిత్రము నున్నవి. ఇవి కథకు సంబంధించని విడిచిత్రములు. ఇట్టి చిత్రములను మలచుటలో కథాసమయములుకాని, శిల్పసమయములుకాని ఏమియు అడ్డురాక శిల్పికి కావలసినంత స్వేచ్ఛ యుండును. ఇవి ఇప్పటి ఖండకావ్యముల వంటివి. ఇట్టి విడిచిత్రములను చిత్రింపవలసివచ్చినప్పుడు బౌద్ధకాలపు శిల్పులు ఆ కాలపు సాంఘిక జీవితమునుండి వృత్తములను గైకొనుట వాడుక. ఇట్టి చిత్రములు చూచువారి మనస్సును రంజింపజేసి కథాఘట్టానుసరణమునుండి కొంత విశ్రాంతి కలిగించుటకు సాధారణముగ ప్రణయలీలలు చిత్రించుచు వచ్చినారు.

రెండవ చిత్రమువలన దెలియవచ్చునది 'నలగిరి'యను ఏనుగును బుద్ధుడు తన శాంతి ధర్మప్రభావమున వశపఱుచుకొనుటను దెలుపు గాథ. ఇది సాధారణముగ ఆనాటి బౌద్ధ శిల్పులకు చాల ఇష్టమైన వృత్తము. నాగార్జునునికొండ, అమరావతిస్తూప శిలాఫలకములమీదను, ఇతరస్తూపపు శిలాఫలకములమీదను ఈ గాథ పలుమాఱులు చిత్రిత మయినది.

దేవదత్తుడు బుద్ధుని దగ్గరబంధువులలో నొకడు. కాని యతడు కడు దుర్మార్గుడు. బుద్ధునికి పేరు ప్రతిష్ఠలు వచ్చుచున్నందుకు, అతనికి గౌరవ మర్యాద లెక్కువగుచున్నందుకు అతనికి అసూయ, ఈర్ష్య జనించి, అతడు బుద్ధుని ఎట్లయినను కడతేర్చుటకు అనేకప్రయత్నములు చేయును. ఈ చిత్రమున సూచిత మయినది అట్టి ప్రయత్నములలో నొకటి.

బుద్ధుడు మహాబోధివిజ్ఞానము నంది, తనమతమును బోధించుచు ఒకప్పుడు శిష్యులతో గలసి మగధయందలి రాజగృహ నగరమునకు వచ్చును. అచట నొక సంపన్న గృహస్థుడు బుద్ధుని, అతని శిష్యులను దనయింట విందుకు పిలుచును. అది తెలిసి, దేవత్తుడు అజాతశత్రు మహారాజునొద్ద నలగిరి యనునొక భయంకరమైన యేనుగుండగా దానిని బుద్ధుడు,తన శిష్యులతో ఆ సంపన్న గృహస్థు నింటికి వెళ్లు మార్గమున వదలిపెట్టవలసినదని ఆ మహారాజు మావటీనిని ప్రోత్సాహ పెట్టును. మావటీడు అందుల కంగీకరించి నలగిరిని వదలివేయును.

చిత్రము కుడివైపు భాగమున స్వేచ్ఛగ వదలివేయబడిన ఆ నలగిరి తన కడ్డువచ్చిన మనుష్యులను కొందరిని కాలితో త్రొక్కి, మరికొందరిని తొండమునకు చుట్టబెట్టి చంపి నానా బీభత్సము చేయుచున్నట్లు చూపబడినది. ఏనుగు ఒక స్త్రీని కాళ్లక్రింద వేసి త్రొక్కుచున్నది. ఆమెకెదురుగ, మీదకు వచ్చు నా యేనుగును చూచుచు భయభ్రాంతుడై ఒక మనుష్యుడు కూర్చున్నాడు. ఉద్ధతితో వచ్చు ఆ యేనుగను చూచి కొందరు—చిత్రమున నలుగురు; వీరిలో ఇద్దరికి చేతిలో కర్రలున్నవి — వెనుకకు తిరిగి తిరిగి చూచుచు కలయద్రొక్కుకొని ముందుకు పరుగిడుచున్నారు. ఎడమవైపు భాగమున బుద్ధుడు తన నైదుగురు శిష్యులతో బయలుదేరి సంపన్న గృహస్థు నింటికి వెళ్లుచున్నాడు. పరవళ్లు త్రొక్కుచు వచ్చుచున్న ఆ యేనుగును చూచి బుద్ధుడు ఏమాత్రము మిసిమింతుడు కాక, చలింపక మందరాచలమువలె సుస్థిరుడై మూర్తీభవించిన శాంతమువలె నిలుచున్నాడు. క్రోధోద్రేకముతో బీభత్సము కావించుచున్న ఆ నలగిరి వచ్చి వచ్చి ఆ పరమ కారుణికమూర్తి, పరమ శాంతమూర్తి బుద్ధునిముందు మోకరించి అతని పాదపద్మములకు నమస్కరించుచున్నది. ప్రక్కనున్న జనము ఈ యత్యద్భుత సంఘటనను చూచి విస్మయాద్భుత సూచకముగ చేతు లెత్తి ఆనందము నొందుచున్నారు. బుద్ధుడు తనదివ్య ప్రభావముచేత తన కపకృతి చేయ వచ్చిన 'నలగిరి'ని వశము చేసికొనును. దేవదత్తుని దుష్ప్రయత్నము విఫలమగును. ప్రేమ 'అప్రేమ'ను జయించెను.

తరువాతి ౩, ౪, ౫, ౬, ౭ చిత్రములు ఒకటే జాతకకథకు సంబంధించినవి. దీనికి ప్రాకృతమున 'వెస్సంతర జాతక'మని పేరు. బుద్ధుడు అనేకములుగ నున్న తన పూర్వజన్మలలో ఒకమారు 'వెస్సంతరు' డను రాజకుమారుడుగ జన్మించెను. అతడు వైశ్యబృందమునడుమ వైశ్య

భారత్ బల్బులకు సోల్ ఏజంట్లు




భారత్ బ్యాటరీలు

నాత్సఖి ట్రింగులు

ప్రతిచోట అమ్మబడును.

డవెల్సు ఎలెక్ట్రికల్సు కంపెనీ,
286, లింగశెట్టివీధి మద్రాసు

---

బలము ! ధాతుపుష్టి !! సజీవత్వము !!!

గోపన్

# కాయసిద్ధి మకరధ్వజము




ఇది బంగారము, కాంతము, ముత్యము, పగడము, గంధకము, కస్తూరి, ధాతువృద్ధి మూలికలచే తయారుచేయబడినది.

ఇది రక్తమును శుద్ధిచేసి, రక్తపారుదల నభివృద్ధిచేసి, నరములకు బలమునిచ్చి, బలము, ధాతుపుష్టి, సజీవత్వమును పుష్కలముగ నొసగును.

ప్రాచీన సిద్ధ ఔషధములు

నాడీపరీక్ష నిపుణులు

## పండిత ఇ. ఎస్. గోపన్

గారిచే కనిపెట్టబడినది.

మధుమేహము, పక్షవాతము, కీళ్లవాతము, సుఖజాడ్యములు, శ్వాసకాసము, మూలము, గుల్మము, ఋతుజాడ్యములు, మరియితర వ్యాధులు పూర్తిగా బాగుచేయబడును.

తపాలమూలకముగనైనను, నేరుగనైనను పలుకకోరుడు.

## టమిల్‌నాడు ఆయుర్వేదిక్ ఫార్మసీ, లిమిటెడ్,

తపాలపెట్టె నెం. 278, మదరాసు.

వీథిలో జన్మించుటచేత అతనికి వెస్సంతరుడని పేరు కలిగినది.

వెస్సంతరుని భార్యపేరు మాద్రి; తండ్రిపేరు సంజయ మహారాజు.

వెస్సంతరునికి అడిగిన వారికి లేదనకుండ నిచ్చుదానగుణము ఒక వ్యసనముగ పరిణమించినది. తానెక్కడనున్న నక్కడ కఱవన్నది లేకుండజేయు తెల్లయేను గొకటి వెస్సంతరునియొద్ద నుండెను.

ఇట్లుండ నొకప్పుడు కళింగ దేశమున వానవర్షములులేక దుర్భిక్షము సంభవించెను. వెస్సంతరుని త్యాగశీలమును, తెల్లయేనుగు వృత్తాంతమును దెలిసికొన్న కళింగదేశ బ్రాహ్మణులు కొందరు అతనియొద్దకు వెళ్లి శ్వేతగజమును యాచించిరి. ఏమాత్రమును సంశయింపక యాతడు వారి కాయేనుగును దాన మిచ్చెను.

ఈ సంగతి తెలిసి ప్రజలు ఆగ్రహావిష్టులై అమూల్య ధనము—ఆ తెల్లయేనుగును—దాన మిచ్చివేసె నని సంజయ మహారాజుకడ కరిగి మొరపెట్టుకొని, అట్టివానిని రాజ్యమున నుండనిచ్చుట ప్రజలకు క్షేమము కాదని బోధించి వెస్సంతరుని పుత్రకళత్రసమేతముగ రాజ్యమున నుండి వెడల గొట్టింతురు. వెస్సంతరుడు రాజ్యమును వదలిపెట్టి భార్యాపుత్రులతో నడవుల కరుగును. అచటికి కూడ అతనిని వెదకికొనుచు యాచకులైన మఱికొందరు బ్రాహ్మణులు రాగా వారికి క్రమముగా తన రథమును, పిదప గుఱ్ఱములను, తన యిరువురు పిల్లలనుగూడ నిచ్చివేయును. తుదకు ఇతని దాతృత్వమును పరీక్షింపగోరి మాయాబ్రాహ్మణవేషముతో వచ్చి అతని భార్యనే యడిగిన శక్రునికి (ఇంద్రునికి) వెస్సంతరుడు ఆమెను సైత మిచ్చివేయును. అప్పు డాతని దాతృత్వాగరిమ కాశ్చర్యము నొంది శక్రుడు నిజరూపము దాల్చి ప్రసన్నుడై యతని భార్య నతని కిచ్చివేయుటయేగాక అతని కనేకవరములనుగూడ ప్రసాదించును. వెస్సంతరుని తండ్రియైన సంజయుడు పిల్లలను దానముగ ప్రతిగ్రహించిన బ్రాహ్మణునకి వలసిన ధన మొసంగి వారిని విడిపించును. పిదప నతడు పిల్లలను దీసికొని, కుమారుని కోడలిని వెదకికొనుచు నరణ్యముల కరిగి వారిని కలసికొని తుదకు తన రాజ్యమునకు దీసికొనిపోవును. ఈ విధముగ కథ సుఖాంతముగ పర్యవసించును.

ఈ కథ ఈ గోలీ శిల్పచిత్రముల యందువలె మరెచ్చటను ఇంత విస్తరముగ చిత్రింపబడ లేదు.

ఇక మూడవ చిత్రమును చూతము. వెస్సంతరుడు వాడుకగా దానకార్యములను నిర్వర్తించుచుండు తన 'ధర్మసత్రము' (దానగృహము)నకు పరిచారికా బృందము పరివేష్టించిరా ఏనుగు నెక్కి వెళ్లుచున్నాడు. దానసమయమున కవసరమైన జలకుండికను, దాన మిచ్చునపుడు పోయుజలమును బట్టుటకు ఒకపాత్రమును పరిజనులు నెత్తిని బెట్టుకొని కొనిపోవుటను చిత్రమున కుడివైపు భాగమున చూడగలము. ఈ పరిజనమున కత్తులు కటారులు పుచ్చుకొని పోవు అంగరక్షకులును, రాజసేవకులును గూడ నున్నారు.

నాల్గవచిత్రము ఈ కథలోని మరియొక ఘట్టమును దెలుపుదృశ్యము. ఇచ్చట కుడివైపు భాగమున బండిని తగులును నిలువుగా నొక స్తంభము వంటిది కలదు. ఇట్టిదే మరియొకటి చిత్రమున నెడమవైపు చివరి భాగమునను నున్నది. ఈ రెండు స్తంభములకు నడుమ గల దృశ్యము తెలుపు విషయ మిది: కళింగదేశమున గల్గిన మహాక్షామమును దొలగించుకొను నుద్దేశముతో శ్వేతగజమును వెస్సంతరునినుండి యాచింపవచ్చిన కళింగ బ్రాహ్మణులు ఈ చిత్రమున కుడివైపుభాగమున నున్నారు. ప్రధానముగ మనకు ముగ్గురు కనబడుచున్నారు. వారి వెనుకనున్న జనసమూహములో మరి కొందరు కూడ నుండవచ్చును. కథ ననుసరించి ఇట్లు యాచింపవచ్చిన బ్రాహ్మణులు ఎనమండ్రు. వెస్సంతరుడు ఏనుగు తొండమును ముందరి బ్రాహ్మణుని కుడిచేత నుంచి, "తుభ్య మహం సంప్రదదే న మమ" అని తన రెండు చేతులతోను పట్టుకొన్న జలకుండికలోనుంచి నీళ్లు వదలుచున్నాడు. అవసరమయినచో జలకుండికలో మరల నీళ్లుపోయుటకు వెస్సంతర రాజకుమారునికి వెనుక నొక మహాగుజ్జు జలపాత్రను బట్టుకొనియున్నాడు. విడిచిన దానజలము పడుటకై సరిగా తొండమునకు దిగువ నొకపాత్ర మున్నది. దాన

ప్రతిగ్రహము చేయు బ్రాహ్మణులు ముగ్గురు ఎకముచేత సంచులు పట్టుకొనియున్నారు. ఈ సంచులలో ప్రాయికముగ దాన మిచ్చుముందర రాజకుమారు డిచ్చిన సువర్ణ దక్షిణ యుండవచ్చును. ఈ తెల్లఏనుగును రాకొమరుడు దానమిచ్చుచున్నందులకు విచార హృదయులై ప్రజలు బ్రాహ్మణులకు వెనుక ప్రక్కనుండి ఈ తంతు తిలకించుచున్నారు.

ప్రజలు సంజయ మహారాజునొద్దకుపోయి ఈ వృత్తాంతమంతయు జెప్పి, రాజకుమారుని అతని 'దానపిచ్చి'కి నిందించి అతనిని రాజ్య బహిష్కృతుని గావింపనాతని (మహారాజున) కుద్బోధించు విషయము ఇందు చిత్రింపబడలేదు.

అయిదవ చిత్రము రాజ్య బహిష్కృతుడైన వెస్సంతర రాజకుమారుడు తనభార్య మాద్రిని, తనయిరువురు పిల్లలను వెంటబెట్టుకొని, హయములు పూన్చిన రథము నెక్కి అడవుల కేగుటను దెలుపును. కథలో వెస్సంతరుడు రథారూఢుడై వెళ్లినట్లుండ నీ చిత్రమున శిల్పి యతడు రెండెడ్ల బండిలో వెళ్లినట్లు చిత్రించెను. ఈ కథకు బండిలో వెళ్లినట్లు తెలుపుపాఠాంతర మేదయిన నాడు ఆంధ్ర దేశమున వాడుకయం దుండెనో, లేక శిల్పియే స్వతంత్రించి యట్టి మార్పు చేసెనో తెలియదు. కాని రాజ్య వైభవమునెల్ల బోవిడిచి, రాజ్య బహిష్కృతుడయి అడవుల కేగినవాడు రాజకుమారుడైన నేమి గాక, అత్యంతము సామాన్యునివలె అతడు రెండెడ్ల బండిలో వెళ్లెనను టలోనే యెక్కువ ఔచిత్య మున్నది. ఒకవేళ కథకు పైని చెప్పిన యట్టి పాఠాంతరమే లేకపోయినచో ఆనాటి ఆంధ్రశిల్పులు తమ కళా రచనములయందు ఎక్కువ యౌచితిని పాటించుచు వచ్చినారని చెప్పవచ్చును. బండిని తోలుచున్నవాడు వెస్సంతరుడు. బండి గూటిలోనుండి మనకు అతనిభార్య మాద్రియు, అతని ఇరువురు పిల్లలును కనబడుచున్నారు. క్రీస్తుశకము నాలుగవశతాబ్దిని కృష్ణాతీరమున ఆంధ్ర దేశమునందు వాడుకలో నుండిన ఎడ్లబండ్లు ఎట్టివో దీనినిబట్టి మనము గ్రహింపవచ్చును. ఈ చిత్రము 'క' భాగమున కుడి ప్రక్క దిగువ నొక పెద్ద పులి, ఒక సింహము, ఒకకోతి, ఒక తేలు చిత్రింపబడుటవల్ల బండి అటవీప్రదేశమున ప్రవేశించుచున్నట్లు సూచనయగుచున్నది.

వెస్సంతరు డడవుల కరిగినపిదప మరల అతనిని యాచించుటకు నలుగురు బ్రాహ్మణులు పట్టణమునకు వెళ్లి, జరిగిన యావద్వృత్తాంతమును దెలిసికొని అతడు వెళ్లిన త్రోవనుబట్టి వెదకికొనుచు పోయి తుద కతనిని గలసికొని దానము వేడుదురు. అప్పుడు వెస్సంతరుడు తనయొద్ద ఇయ్యదగిన దేదియులేక బండికి కట్టిన వృషభములను వారికి దానమిచ్చును. ఇందు వలననే 'క' భాగమున గనబడు ఎద్దులు 'చ' భాగమున గనబడవు. పిదప తమ పిల్లల నిరువురను బండిలో గూర్చుండబెట్టి వెస్సంతరుడును, అతనిభార్యయు బండిని లాగుదురు. ఈ దృశ్యము ౫-వ చిత్రమున 'చ' భాగమున జూపబడినది. ఈ భాగమునందలి లేడియు, సింహమును ఆ ప్రాంతము అరణ్యమని తెలుపును. మరల ఇచ్చటికి కూడ ఇరువురు బ్రాహ్మణులు వచ్చి, వెస్సంతరుని దానమడుగుదురు. ఈ యిరువురిలో ఒకడు గొడుగు వేసుకొని యున్నాడు; మరియొకడు అతని ప్రక్కనే నిలబడినాడు. వీరికి వెస్సంతరుడు బండిని దానమిచ్చి పంపివేయును. పైన ఖేచరులు అతని దాతృత్వమును ప్రశంసించి యతనిని కీర్తించుచున్నారు. 'చ' భాగమున కుడివైపు నున్న చెట్టుతో ఈ రంగమాఖరు. ఈ చెట్టు తరువాతి చిత్రములు తరువాతి కథాభాగమును తెలుపునవి. వీటినిమిత్తమిక ఆరవ చిత్రమును చూతము.

ఆరవచిత్రము 'క'భాగము శకటదానానంతరము జరిగిన కథ తెలుపును. బండిని దానమిచ్చిన పిదప వెస్సంతరుడును అతని భార్యయు ఒక్కొక రొక్కొక బిడ్డ నెత్తికొని పోవుదురు. ఈ భాగమున పైన సింహములు, క్రింద ఏదుపందులు నుండుటనుబట్టి వారు అరణ్యమున ప్రయాణము చేయుచున్నట్లు స్పష్టమగుచున్నది. వెస్సంతరుడు కుమారుని తనభుజములమీద గుర్రమెక్కించుకొనిపోవుచున్నాడు. మాద్రి తనకూతురిని చంకనెత్తుకొని పోవుచున్నది. 'చ' భాగమున చుట్టుగుడిసెవంటి యొకకుటీర మున్నది. అడవిలోని ఈ కుటీరమున వెస్సంతరుడును, అతని భార్యయు నివసించు

